# గాంధీసందేశ ప్రాధాన్యం

## జనరల్ నజీబ్ ప్రశంస: హైద్రాబాద్ ప్రముఖునికి లేఖ

హైదరాబాదు, డిసెంబరు 19. జాతికీ, అశేష ప్రపంచానికీ కూడా గాంధీజీ అమరమూర్తి అనీ, ఈప్రపంచమున్నంతకాలమూ ఆయన బోధనలు మనతో యుంటూగలవనీ ఈజిప్టు అధ్యక్షుడు జనరల్ నజీబ్ సయ్యదీ జఫర్ హుసేనీ అనే ఒక హైదరాబాదు వాస్తవ్యునికి వ్రాసినజాబులో తెలియజేశారు.

ఆత్మ పరిశుద్ధి శాంతి సహనాలను గురించిన గాంధీజీ సిద్ధాంతాలు తనకు చాలా చాలా నచ్చినట్లు కూడ ఆయన తెలిపారు.

మహాత్మాగాంధీజీని గురించిన ఒక పుస్తకాన్ని ముగించినట్లున్నూ ఇప్పుడు ఇంకొక పుస్తకాన్ని వ్రాస్తున్నట్లున్నూ ఆయన వెల్లడించారు.

ఇండియా ఈజిప్టులమధ్య సంబంధాలు ఇదివరకున్నా సౌమనస్యంగా ఉండాలనే అభిప్రాయాన్ని కూడ ఆయన వ్యక్త పరిచాడు.

తన లక్ష్యాలను సాధించుటకు ఈజిప్టు గాంధీజీయొక్క సహాయ నిరాకరణ, అహింసా సిద్ధాంతాలను అనుసరించాలని సూచిస్తూ హుసేనీగారు వ్రాసిన జాబుకు జనరల్ నజీబ్ సమాధానమిస్తూ ఈవిధంగా తెలియజేశారు.



# "డిటెన్షన్ విధానాన్ని రద్దుచేయాలి"

## ముఖ్యమంత్రికి విద్యార్థుల విజ్ఞప్తి

కాకినాడ, డిశంబరు 18: ఈ పట్టణ డెమొక్రటిక్ విద్యార్థి యూనియన్ వారు, రాష్ట్ర ముఖ్యమంత్రిగారు శ్రీ ప్రకాశంపంతులుగారికి విజ్ఞాపన సమర్పిస్తూ డిటెన్షన్ విధానమును రద్దుచేసి వేయాలనికోరారు, రాయలసీమ విద్యాలయాలను, ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయాలని మద్రాసు ప్రభుత్వము అమలుపరచిన నూతన ప్రాథమిక విద్యావిధానాన్ని ఆంధ్ర ప్రభుత్వం అమలు జరుపరాదని విజ్ఞాపనలో కోరారు. హైదరాబాదు రాజధానిగా విశాలాంధ్ర స్థాపనకు కృషి చేయవలసినదిగా ఆంధ్ర ప్రభుత్వాన్ని 'మేము' అర్థిస్తున్నామని, యీ విషయంలో ఆంధ్ర ప్రభుత్వమునకు అన్నివిధాలా సహాయం చేయుటకు విశాలాంధ్ర విద్యార్థి మహాసభ స్థాపించబడిందని విజ్ఞాపనలో తెలియచేశారు.

# నెల్లూరుకు రెవెన్యూ మంత్రిరాక

## ఆహారస్థితిగురించి స్థానికోద్యోగులతో చర్చ

నెల్లూరు, డిసెంబరు 17: రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ మంత్రి శ్రీ కె. కోటిరెడ్డిగారు, రెవెన్యూబోర్డు సభ్యుడు శ్రీ ఎం. పి. పాయ్ గారు, మొన్న యిక్కడికి వచ్చారు. వీరు, శ్రీయుతులు ఆనం చెంచుసుబ్బారెడ్డి, నూతి జగ్గయ్య, చుండూరు కన్నయ్య, కోట్లా ఆదిశేషయ్య, కామిశెట్టి సుబ్బారాయుడు గార్లను పిలిపించి స్థానిక ఆహార పరిస్థితి గురించి చర్చించారు.

జి. బి. 24 నెంబరు దాన్యం 10 వేల పుట్లు ఉన్నదని, ఆనంచెంచు సుబ్బారెడ్డిగారు చెప్పారు. వెంకటగిరి ప్రాంతంలో ఆహార పరిస్థితిగురించి, ఎస్టేటు మేనేజరు వివరించారు.

# శ్రీ జి. యస్. యల్. నరసింహమూర్తి

## ఉన్నత విద్యాభ్యాసానంతరం స్వదేశానికి ఆగమనం

రాజమండ్రి, డిసెంబరు 17: ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలాధ్యాపకులుగా వుండిన శ్రీ జి. యస్. నరసింహమూర్తిగారు అమెరికాలో 3 సం॥ల ఉన్నతి విద్యాభ్యయనానంతరం, కెమికల్ యింజనీరింగులో మాస్టరుడిగ్రీ (లూయివిలీ - కెంటుకీ) డాక్టర్ డిగ్రీ (సిన్సినాటి-ఒహియో) పొంది-స్వదేశానికి తిరిగివచ్చిన సందర్భములో యీ ఉదయము వారు మద్రాసుమెయిలు దిగగానే వారికి మిత్రులు పుష్పహారవిందు చేశారు. పత్రికాప్రతినిధులతో ప్రసంగిస్తూ, వారు అమెరికా విశ్వవిద్యాలయాలలో భారతీయుల కున్నతవిద్య బడయుటకు చాలినన్ని సౌకర్యాలు కలవన్నారు. తమకు నెలకు 100 డాలర్లు ఖర్చయ్యేదన్నారు. అక్కడ వాతావరణమునకు అలవాటుపడిన భారతీయులు కొందరచట స్థిరనివాస మేర్పరచుకొనఅభిలషిస్తున్నారన్నారు. సామాన్యంగా అమెరికను భారతీయులయెడ గౌరవాదరణలతో వుంటున్నారని చెప్పారు. తాము తిరిగి ఆంధ్ర విశ్వవిద్యాలయములోనే పని చేయవచ్చునన్నారు. (స్వ. వి.)

# మదనపల్లి ప్రసూతి వైద్యాలయాలకు ద్రవ్యసహాయం

మదనపల్లి, డిసెంబర్ 19. ఢిల్లీలోని కేంద్రసాంఘిక సంక్షేమ సంఘం వారు, గతంలోని సంఘసేవా సంస్థలకు సహాయం చేసే కార్యక్రమం క్రింద, మదనపల్లిలోని నోరా సేజరు బేబీ వెల్‌ఫేరుకు, ప్రసూతి వైద్య కేంద్రాలకు 5 వేల రూ. లు గ్రాంటు యిచ్చారు. ఈ డబ్బుతో ఈ కేంద్రాలకు కావలసిన వైద్యపరికరాలు కొంటారు.

# తెలంగాణా రచయితల వార్షికోత్సవం

## హైదరాబాద్ సభల విశేషాలు

హైదరాబాదు, డిసెంబరు 17: అతిసుందరంగా నిర్మించబడిన 'సాము యూనా' మండపాలక్రింద ప్రతాప గిరికోటలో తెలంగాణా రచయితల సంఘం ప్రథమవార్షికోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. త్రివర్ణ పతాకాలతో రంగులు చిమ్ముతున్న ఆవరణంలోకి ప్రవేశించగానే కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారి స్మృతి చిహ్నం 'సురవరంద్వారం' ఏర్పాటు చేయబడింది. ద్వారంలోనుండి ప్రత్యేక మంటపంలోకి ప్రవేశించగానే నాటకప్రదర్శనాలకు ఉపయోగించే తెరని పరదాలతో, రంగు రంగుల పూగుత్తులతో అలంకరించబడిన సుందరమైన వేదిక సిద్ధపరుపబడింది.

12వ తేదీ సాయంత్రం 'నా తెలుగు జేజేలు' అన్న ఇంద్రగంటివారి గేయంతో సభ ప్రారంభమైంది. స్వాగతోపన్యాసం తరువాత హైదరాబాదు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ప్రముఖుల శుభాకాంక్షల తరువాత శ్రీ దాశరథి అధ్యక్షోపన్యాసం చేశారు. తరువాత 'భిన్న స్వరాలు' అనే గేయ నాటికను మహిళా కళాశాలా విద్యార్థినులు అమోఘంగా ప్రదర్శించారు. ఈ నాటక సి. నారాయణరెడ్డిగారి రచన. ఆ తరువాత ఆచార్య ఆత్రేయ రచించిన "ప్రగతి" అనే నాటకం నవ్యకళాసమితివారు ప్రదర్శించారు. గిడుతూరి సూర్యం గారు రచించిన 'మానవుడు' అనే మూకాభినయ ప్రదర్శనం జరిగింది. మధ్య మధ్య రాధాకృష్ణమూర్తి మున్నగువారు శ్రావ్యంగా గీతావళి గానం చేశారు.

13వ తేదీ ఆదివారం ఉదయం శ్రీరంగం శ్రీనివాసరావుగారి అధ్యక్షతన సాహితీగోష్ఠి జరిగింది. సభను ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ప్రారంభించారు. శాస్త్రిగారు మాటాడుతూ "తెలంగాణ రచయితలలో కలిగిన నూతన చైతన్యాన్ని పురస్కరించుకొని జరుగుతూన్న ఈ బ్రహ్మాండమైన మహాసభలు నాకు ఎంతో ఆనందాన్ని కలిగించాయి. గత పది ఏళ్ళలో ఇంతటి ఉత్సాహాన్ని నేను చూడలేదు. మంత్రుల వద్దనుండి సాధారణులదాకా అంతా యీ సందర్భాన ఈ సభల్ని ప్రోత్సహించడం ఎంతో కొనియాడదగింది. అంధ్రదేశంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చినరచయితలంతా ఏక వేదిక మీద సమావేశం కావడం చూస్తే సాహిత్యదృష్ట్యా విశాలాంధ్ర ఇప్పుడే ఏర్పడిందనిపిస్తున్నది.

పుల్‌స్టాపులను ద్వేషించటమే అభ్యుదయ వాదం, మనం నూత్న మార్గాన్ని నిర్భయంగా అనుసరించాలి. అయితే మన ప్రాచీన సాహిత్యంలోని వైలక్షణ్యాన్ని మన రచయితలు బాగా ఆకళించుకొని నూత్న మార్గాన్ని పోవాలి. కొత్తపాతలు ఒకదానికొకటి సహకారులు కాని ప్రత్యర్థులు కావు. ఈదృష్టిని అలవరించింది గురజాడ. మనం అతని మార్గాన్ని అనుసరించాలి అన్నారు."

అధ్యక్షులు శ్రీనివాసరావుగారు మాటాడుతూ "తెలంగాణంలో మాట్లాడబడే భాషలో ప్రత్యేకమైన రీతులున్నాయి. రాయలసీమ సర్కారు ప్రాంతాల వారికి ఇక్కడి నుడికారం పలుకుబడినిగూర్చి తెలుసుకోవలెనను కోర్కె అధికంగా వుంది. ఇక్కడి రచయితలు తమ ప్రాంత ప్రజలు మాటాడే వాడుక భాషలోనే రచనలు చేయాలి. ఇతర ప్రాంతాల వాళ్ళకు ఈభాష వచ్చదేమోనని వెనుకాడరాదు. అసలు భాష జిల్లా జిల్లాకూ మార్పుగా వుంటుంది. దని సౌందర్యం దానిదే. ఆరోగ్యవంతమైన సాహిత్య విమర్శ నిరివిగా సాగుతూ వుండడం మంచిది." అన్నారు.

శ్రీ ఆరుద్ర, శ్రీ దివాకర్ల వెంకటావధాని శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి మున్నగువారు వివిధ సారస్వత రీతుల్ని గూర్చి ఉపన్యసించారు.

మధ్యాహ్నం ప్రతినిధుల సమావేశం జరిగింది. పుటుపుటూరి రాఘవాచార్యులుగారు అధ్యక్షత వహించారు. కోదాటి నారాయణరావుగారు సమావేశాన్ని ప్రారంభించారు. సమావేశంలో కీ॥ శే॥ పొట్టి శ్రీరాములు, సురవరం ప్రతాపరెడ్డి గారల మరణంపట్ల సంతాపాన్ని ప్రకటిస్తూ తీర్మానాలు చేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రాచ్యభాషా పరీక్షలు ప్రవేశ పెట్టాలెననీ, విశ్వవిద్యాలయాన్ని హిందీ విద్యాలయంగా మార్చరాదనీ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. నియమావళిలో జరుపవలసిన మార్పులను గురించి చర్చించారు. శ్రీ ఆళ్వారుస్వామి, శ్రీ రామరాజు శ్రీ రాగి జల్సింలు మున్నగువారు ప్రసంగించారు.

సాయంత్రం అభినవపోతన వానమామలై వరదాచార్యులు గారికి సన్మానం జరిగింది. శ్రీ బంధి వారు ... లో పట్టు శాలువలలో, నూట పదార్లతో రచయితల సంఘంవారు వరదాచార్యుల వారిని సన్మానించారు. శ్రీ దాశరథి వరదాచార్యుల వారిని గూర్చి ప్రసంగించారు. కాళోజీ నారాయణరావు గారి అధ్యక్షతన బ్రహ్మాండమైన కవిసమ్మేళనం జరిగింది. ఇందులో పండితకవులు, శృంగారకవులు, భావకవులు, అభ్యుదయ కవులు మొత్తం యేబదిమంది పాల్గొన్నారు. సమ్మేళనాన్ని పట్టి నారాయణాచార్యులు గారు ప్రారంభించారు. శ్రీరంగం శ్రీనివాసరావు, ఇంద్రగంటి, మలవరపు విశ్వేశ్వరరావు, ఆరుద్ర, శలా దిరయ్య, సి. నారాయణరెడ్డి, దాశరథి, కమలం మనోహరరావు, సంపత్కుమార మున్నగు వారి సేవలు పాల్గొన్నారు.

# విశాఖపట్టణంలో నౌకాదినోత్సవాలు

## గవర్నరు శ్రీ త్రివేదీ నౌకాభివందన స్వీకరణ

విశాఖపట్టణం, డిసెంబరు 19: నౌకాదినోత్సవం సందర్భంలో ఇక్కడి నౌకాశాఖ, నౌకాదళాల కవాతుసందర్భంలో ఆంధ్రరాష్ట్ర గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీగారు నేటి ఉదయం నావికాభివందనం స్వీకరించారు. ఇక్కడి పోలీస్ పెరేడ్ గ్రౌండ్సులో ఈ కవాతు ప్రదర్శనలు జరిగినవి.

అంతకుముందు గవర్నరు శ్రీ త్రివేదీ నౌకాదళంవారి గౌరవాభివందనం స్వీకరించారు.

ఈ ఉత్సవాలసందర్భంలో పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్ చక్కగా అలంకరించబడినవి. అనేక మంది ప్రజలు ఉత్సవాలు చూడడానికి వచ్చారు.

నౌకాదళాలు, నౌకాశాఖలు, నేవల్ కెడెట్ కోర్ లనుద్దేశించి ప్రసంగించవలసిందిగా గవర్నరు శ్రీ త్రివేదీగారిని అభ్యర్థించుతూ నౌకాశాఖోద్యోగి కెప్టెన్ ఆర్. సావానీగారు ఇలా అన్నారు:

"1944 లో నౌకాశాఖోత్సవాలు ప్రారంభించబడినవి. ఆ తరువాత జరిగిన మొదటి నౌకాదినోత్సవం ఇదే. ఈ సంవత్సరం బొంబాయిలో నావికా సైన్యోత్సవాలు జరిగినవి. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ వాటిని పరీక్షించారు. మూడు రక్షణశాఖలకూ ప్రజలతో సన్నిహిత సంబంధాలు ఏర్పాటు చెయ్యాలని మన ప్రధాని కోరిక. నౌకాశాఖవద్దకు ప్రజలువచ్చేబదులు ప్రజలవద్దకే నౌకాశాఖ వెళ్లడానికి ఈశాఖ ప్రయత్నించింది. 1612 లో ఈశాఖ నెలకొల్పబడింది. అప్పుడది చాలా చిన్నదే. అయితే ఉత్సాహం విషయంలో నేమి, శక్తి సామర్థ్యాల విషయంలో నేమి ఈశాఖ అనన్యంగా వుండేది. ఈ ఉత్సవాల సందర్భంలో నేడు ఉత్సవాలు జరుగుతవి. "గోహిల్‌ఖండ్" నౌకను దీపాలతో అలంకరిస్తాము."

నేటి సాయంకాలం నావికా ఉద్యోగులను, నౌకాశాఖలను, నేవల్ కెడెట్ కోర్‌ను ఉద్దేశించి గవర్నరు శ్రీ త్రివేదీ ఇలా ప్రసంగించారు:

"నౌకాదినోత్సవం సందర్భంలో కవాతును పరిశీలించడం నాకు సంతోషంగా ఉన్నది. ఎనిమిది సంవత్సరాల తరువాత తిరిగి ఈనాడు ఈ ఉత్సవాలు జరుగుతున్నవి. నౌకాశాఖలవారందరినీ కలుసుకునే అవకాశం ఇందుమూలంగా నాకు లభించింది. భారత నౌకాశాఖ చాలాగొప్పది.

గత యుద్ధకాలంలో నౌకాదళంలోని అన్ని శాఖలవారితో నాకు ఎక్కువకాలం సంబంధం వుండేది. భారతీయనౌకాసైన్యం చాలా పురాతనమైనదేఅయినా, మొదట్లో చిన్నదే అయినా క్రమంగా ఒక "క్రూయిజర్", ఆరు డిస్ట్రాయరు, ఒక టాంకరూ, ఒక మరమ్మతునౌక, బ్రిటిషువారి హయాములో ఈ సైన్యంలో చేర్చబడినవి. ప్రత్యేకంగా ఈశాఖకు ఒక కమాండర్ ఉన్నాడు. క్రమంగా ఈ శాఖ అభివృద్ధి చెందినది. కరాచీ నౌకాశ్రయంలో మనకు చాలా నౌకాసామగ్రి ఉండేది. విభజన కారణంగా మనం దానిని వదులుకున్నాము. ఇప్పుడు తిరిగి అదంతా చేకూర్చుకొన్నాము."

ఈ సందర్భంలో బొంబాయిలో తయారైన నౌకలు బ్రిటిషు ఫాల్క్ రీ యుద్ధంలో ప్రముఖపాత్ర నిర్వహించినవిషయం గవర్నరు ప్రస్తావించారు. విశాఖ నౌకాశ్రయంలో యుద్ధ నౌకల నిర్మాణం కూడా త్వరలో ప్రారంభం కాగలదని ఆశిస్తున్నా నన్నారు.

ఆ తరువాత గవర్నరు శ్రీ త్రివేదీగారు నౌకాప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపారు.

ఈ సందర్భంలో నౌకాదళంలో కొత్తవారిని చేర్చుకునే కార్యాలయం కూడా ఏర్పాటు చేయబడింది. (స్వ. వి.)

# ఆంధ్ర గవర్నమెంటు ప్లీడర్ల సంఘం

## జనవరి 17 న గవర్నరు ప్రారంభోత్సవం

మచిలీపట్నం, డిసెంబరు 18: ఆంధ్రరాష్ట్ర గవర్నమెంటు ప్లీడర్ల సంఘమునకు జనవరి 17 వ తేదీన రాష్ట్రగవర్నరు శ్రీ సి. యం. త్రివేది గారు ప్రారంభోత్సవం జరుపుతారు. ఆంధ్రప్రభుత్వ అడ్వొకేట్ జనరల్ డి. నరసరాజుగారు సభకు అధ్యక్షత వహిస్తారు.

కృష్ణా జిల్లా గవర్నమెంటు ప్లీడరు యీ సభకు తగు సన్నాహాలు చేస్తున్నారు.

# ఎన్. జి. ఓ ల పిల్లలకు ఉన్నత విద్య

## ముఖ్యమంత్రికి శ్రీకాకుళం ఎన్. జి. ఓ ల విజ్ఞప్తి

శ్రీకాకుళం, డిసెంబరు 18: శ్రీకాకుళంజిల్లా యన్. జి. ఓ. ల సంఘం వారు ఆంధ్రముఖ్యమంత్రి శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారికి విజ్ఞాపన సమర్పిస్తూ తమ పిల్లలకు ఉచితంగా రివ ఫారం వరకేగాక పైచదువులకున్నూ అవకాశం యివ్వాలనీ, అదేవిధంగా రిటైరయినవారికిగూడా అవకాశం యివ్వాలని, సెలవు నిబంధనలు సరిదిద్దాలనీ, గృహనిర్మాణం చేయించాలనీ, బ్రిటిషుపరిపాలనలో పెట్టబడిన రహస్యరిజిస్టరు పద్ధతిని రద్దుచేయాలనీ కోరారు. ముఖ్యమంత్రిగారు సావకాశంగా విని యీ కోర్కెలు ఆలోచన చేసెదమని జవాబు యిచ్చారు.

### ఫిర్కా అభివృద్ధి కమిటీలు

శ్రీ పుల్లెల సీతారామయ్యపంతులుగారు, మరికొందరు పెద్దలు శ్రీప్రకాశంపంతులుగారిని సందర్శించి ప్రతి జిల్లాలోనూ శాసనసభా సభ్య నియోజకవర్గాన్ని ఒక యూనిటుగా చేసి, ఆ నియోజకవర్గ శాసనసభ్యులు సహా కొందరితో ఆయూనిట్ లో ఫిర్కా అభివృద్ధి కార్యక్రమ నిర్వాహణకు కమిటీలను పెట్టి ప్రజలకు అవసరమైన కార్యాలను చేయించాలనిఅర్థించారు. అలా చేసినట్లయితే ఆ సభ్యుని కిన్నీ తన యూనిటుగురించి శ్రద్ధ ఎక్కువయి ప్రభుత్వమునకు సహాయపడుతూ తనయొక్కయు, యూనిట్ లోని కమిటీయొక్కయు కృషి ఫలించేటట్లు చేయగలడని అన్నారు. యీ జిల్లాలో ప్రాజెక్టులు మాంగనీసు పరిశ్రమాభివృద్ధి, కళింగపట్నం, బారువ రేవును తెరచుట, కళింగపట్నంనుండి ఆముదాలవలసకు రెయిల్వేనిర్మాణం మొదలగు విషయములను గురించి చర్చించారు. ప్రతి యూనిట్టుకు ఒక కేంద్ర స్థలములో వ్యవసాయమును ఆదర్శవంతంగా చూసేఫారం ఒకటి ఏర్పరచాలి. చీపురుపల్లి తాలూకాలో మెట్ట ప్రాంతం హెచ్చుగా యున్నందున తాయన్న బట్టని పాడిగించి నాగావళి నదీ నీటిని సరఫరా చేయించాలని చెప్పారు. పంతులుగారు సావకాశంగా విని, యిందు ముఖ్యంగా నేటి ఆర్థిక స్థితికి అనుకూల్యంగా వున్నవాటిని వ్రాసిపంపమని సలహాయిచ్చారు.

### జిల్లా రైతుసంఘ విజ్ఞాపన

ఆంధ్రరాష్ట్ర ప్రధానమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు గారు శ్రీకాకుళంజిల్లా పర్యటన సందర్భంలో జిల్లా రైతుసంఘం తరఫున ప్రధాన కార్యదర్శి యం. అబ్బాయినాయుడుగారు ఒక విజ్ఞాపన సమర్పించారు.

వంశధారా రిజర్వాయరు స్కీమును రాష్ట్రం తరఫున పంచవర్ష ప్రణాళికలో మొదటిదిగా చేర్చించాలని మదనాపురంవద్ద నేడు జరుపుతున్న పరిశోధన త్వరలో ముగించి 54 సం॥ మొదటిభాగంలో పనిప్రారంభించాలని 'హంసరళి' 'పాడిగాం' ప్రాజక్టుల నిర్మాణానికి రాష్ట్రప్రభుత్వం వెంటనే పూనుకోవాలని కంతిటి కాల్వ భైరి జనిగెడ్డ మొదలగు చెడున్న నీటవసరులకు సక్రమ మరమ్మత్తులు చేయించాలని అందులో కోరారు.

మద్రాసు ఎస్టేటు లాండాక్టు 1908 లోని సెక్షను 8 (2) 'డి' ని మైనరు యీనాంలకు మినహా. మిగత అన్నిరకాల యీనాంలకు వర్తించునటుల సవరించాలని కోరారు.

ఆనాటబారిమండి కుడ్యగమ్మలైన రైతుకూలీలకు రక్షణ కలుగునటుల ఎట్టి మినహాయింపులు లేకుండా అన్నిరకాల అప్పులకు వర్తించునటుల మారటోరియం ప్రకటించాలని అర్థించారు.

పర్లాకిడిమి, కుమారికా, కురపాం ఎస్టేటును ప్రభుత్వం వెంటనే స్వాధీనపరచుకోవాలని కోరారు.

# గుంటూరు మున్సిపాలిటీ

## తెల్లాకుల జాలయ్యగారి ఎన్నిక రద్దు

గుంటూరు, డిసెంబరు 19: 28-వ వార్డునుంచి, ఈ పురపాలక సంఘానికి సభ్యుడుగా ఎన్నికైన శ్రీ తెల్లాకుల జాలయ్యగారి ఎన్నిక చెల్లదని రద్దుచేస్తూ ఆస్థానానికి పోటీచేసిన నామన వెంకటేశ్వరరావుగారు ఎన్నికైనారని నిర్ణయిస్తూ ఎన్నికల కమిషనరు (జిల్లా ప్రిన్సిపల్ సబ్ జడ్జి) గారు నిన్న సాయంకాలం తీర్పు చెప్పారు.

మొదటిప్రతివాది గుంటూరుమున్సిపాలిటీకి చాలాపన్ను బకాయిఉన్నాడని, కరిమసెట్టి సుబ్బయ్య అండ్ సన్స్ పేరిట నడుపుతున్న రైస్ ఫ్యాక్టరీలో మొదటిప్రతివాది, అతని మేనల్లుడు కె. సాంబశివరావు భాగస్వాములని, ఆ ఫ్యాక్టరీపై విధింపబడిన వృత్తి పన్ను మొదటిప్రతివాది చెల్లించాలని ఉన్నదని, కాబట్టి మొదటిప్రతివాది ఎన్నిక అక్రమము, చెల్లనేరదని తీర్పు చెప్పవలసిందిగా పిటిషనరు తనపిటీషన్లో కోరాడు.

నామినేషన్ వేసే తేదీనాటికి, మొదటి ప్రతివాది చెల్లించవలసిన ఆస్తిపన్నూ, ఆదాయపన్నూ, వృత్తి పన్నులకు అధికారులు తను కొన్ని చర్యలు ఇంకింకలో వున్నవని, అందువల్ల మొదటి ప్రతివాది ఎన్నికకు పోటీచేసేహక్కు కోల్పోయాడని అదిగాక, చనిపోయినవారి పేరిట అనేకవోట్లు పోలైనవని అనేక దొంగవోటుగూడా పడెనని పిటీషనరు పేర్కొన్నారు.

మొదట ప్రతివాది తరఫున యం. హనుమంతరావుగారు పిటిషనరు వాదనకు ఆధారంలేదని, ఆయనపేరు గుంటూరు మున్సిపాలిటీ వోటర్ల జాబితాలో లేదని వాదించారు. మొదటిప్రతివాది తనపైచేసిన ఆరోపణలు అసత్యములని అన్నారు.

మొదటి ప్రతివాది, అతని మేనల్లుడు భాగస్వాములుగా నడుపుతున్న ఫ్యాక్టరీ మున్సిపాలిటీకి పన్ను బకాయి ఉండడంవల్ల, మొదట ప్రతివాది నామినేషన్ తిరస్కరించబడవలసి ఉండేదని, ఆకారణంతో ఆయన ఎన్నికకూడా రద్దు చేయవలసి ఉండెనని, ఆ స్థానమునకు పిటీషనరు నామన వెంకటేశ్వరరావు సక్రమంగా ఎన్నికైనారని ఎన్నికల కమిషనరు (జిల్లా ప్రిన్సిపల్ సబ్ జడ్జి) గారు తీర్పు చెప్పారు.

పిటీషనరు తరఫున కె. యజ్ఞనారాయణ, మొదటి ప్రతివాది తరఫున యం. హనుమంతరావు, రెండవ ప్రతివాది తరఫున ... రంగారెడ్డి గారు వాదించారు.

# ప్రజాభివృద్ధి పట్ల ఆంధ్రప్రభుత్వ శ్రద్ధ

## వెంకటగిరిలో మంత్రి కోటిరెడ్డిగారి ఉద్బోధ

వెంకటగిరి, డిసెంబరు 18: నీటి సరఫరా సౌకర్యాల అభివృద్ధి, విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలకు ఆంధ్ర ప్రభుత్వం అధిక ప్రాముఖ్యం ఇస్తున్నదని ఈ నెల 16 వ తేదీన వెంకటగిరి రాజాగారిహాలులో జరిగిన సభలో రెవిన్యూమంత్రి కె. కోటిరెడ్డిగారన్నారు.

నెల్లూరుజిల్లా కలెక్టరు, గూడూరు సబ్ కలెక్టరూ, వెంకటగిరి ఎస్టేట్ మేనేజరూ, పబ్లిక్ వర్క్సుశాఖ ఇంజనీరూ వెంటరాగా సతీసమేతంగా రెవిన్యూ మంత్రి కె. కోటిరెడ్డిగారు ఈ నెల 16 న మోటారుకారులో నెల్లూరునుంచి ఆలిమెల గ్రామం వెళ్లి ఇటీవల కురిసిన వర్షాలవల్ల ఆగ్రామంలో చెరువులకు పడ్డగండ్లను స్వయంగా చూచారు. వాటి మరమ్మతులకు సంబంధించిన అంచనాలు వెంటనే ప్రభుత్వానికి పంపించవలసిందిగా జిల్లాకలెక్టరును చెప్పారు.

అక్కడినుంచి వెంకటగిరికి వచ్చేదోవలో బంగారుపేట చేనేతపారిశ్రామికులు మంత్రి కోటిరెడ్డిగారికీ ఆయన సతి శ్రీమతి రామసుబ్బమ్మగారికీ పూలదండలు వేసి తమకష్టాలు వివరించి తమకు సహాయం చేయవలసిందిగా అర్థించారు. చేనేత పారిశ్రామికులకు తగు సహాయం చేసేవిషయం గురించి ప్రభుత్వము ఆలోచిస్తున్నదని కోటిరెడ్డిగారు వారికి సమాధానం చెప్పారు.

ఆతరువాత వెంకటగిరి రాజాగారి హాలులో జరిగిన సభకు శ్రీమతి రామసుబ్బమ్మగారు అధ్యక్షత వహించారు. తాలూకా జమీన్ రైతు సంఘం, తాలూకా కాంగ్రెసుసంఘం, వెంకటగిరి పౌరసేవాసంఘం, వెంకటగిరి సహకార విక్రయశాల, తాలూకా చేనేత కాంగ్రెసు, వెంకటగిరి చేనేత పరపతి సహకారసంఘ సభ్యులు, తాలూకా యాదవసంఘం, రాజకీయ బాధితుల సంఘం మొదలైనసంఘాలవారు సభలో మంత్రికి విజ్ఞప్తులు సమర్పించారు.

విజ్ఞప్తులకు సమాధానం చెబుతూ ఆంధ్రప్రభుత్వం ప్రస్తుతం ఏడాదికి రెండు మూడు కోట్ల రూపాయల లోటుతో పనిచేస్తున్నదనీ, నీటివసతి అభివృద్ధి, విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలకు గురించి ప్రభుత్వం అధిక ప్రాముఖ్యం ఇస్తున్నదనీ మంత్రి కోటిరెడ్డిగారు అన్నారు. చేనేత పారిశ్రామికులకు చేయవలసిన సహాయంగురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నదనీ, గంజి కేంద్రాలను మరికొంతకాలం నడుపుతామనీ, చేనేతపరిశ్రమకు శాశ్వతి సహాయం గురించి రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నదనీ రివెన్యూమంత్రి వివరించారు. అడవులవిషయం గురించి అందుకు సంబంధించిన అధికారులతో మాట్లాడి తగుసహాయం చేస్తామన్నారు. ఎవరికీ ఇబ్బందులు కలుగని ప్రదేశాలలోని బంజరుభూములను రాజకీయ బాధితులకు ఇప్పించే ఏర్పాటు చేయిస్తామన్నారు. నిరుద్యోగ విద్యార్థులు భూమి సముద్ధరణసంఘాలు నెలకొల్పి పంటలు ఎక్కువగా పండించడానికి కృషి చెయ్యాలని సలహాయిచ్చారు.

అధ్యక్షురాలు శ్రీమతి రామసుబ్బమ్మగారు మాటాడుతూ ఆంధ్రరాష్ట్రాభివృద్ధికి పొట్టి శ్రీరాములు గారి ఆత్మబలిదానాన్ని ఆదర్శంగా తీసుకొని ఆంధ్రులు సమైక్యకృషి చెయ్యాలన్నారు.

వెంకటగిరి నియోజకవర్గ శాసన సభ్యుడు పి. వెంకటస్వామిరెడ్డి గారి కృతజ్ఞతా వందనంతో సభ ముగిసింది.

ఆతరువాత మంత్రి కోటిరెడ్డి గారు లాలాపేట ఆనకట్టవద్దకు వెళ్ళి అక్కడ జరుగుతున్న పని చూచి జిల్లాకలెక్టరుకు తగు సూచనలిచ్చారు. అక్కడినుంచి వెంకటగిరిచెరువు పల్లెకాలువ పూడిక తీసి మరమ్మతు చేసే కార్యక్రమానికి సంబంధించిన అంచనాలు ప్రభుత్వానికి పంపించవలసిందిగా మంత్రి కోటిరెడ్డిగారు కలెక్టరుకు చెప్పారు.

అక్కడినుంచి వెంకటగిరికి తిరిగి వచ్చి కాళహస్తికి వెళ్లారు. స్వ. వి.

# వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి సంఘం

## ప్రగడకోటయ్యగారి సూచన

నిడుబ్రోలు, డిసెంబరు 16: వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి సంఘం ఆధీనంక్రిందకు, రాయలసీమ వెనుకబడిన ప్రాంతాలతోపాటు, నెల్లూరుజిల్లాలోను, కోస్తాజిల్లాలలోను వెనుకబడిన ప్రాంతాలను తేవాలని శ్రీ ప్రగడకోటయ్య ఎం. ఎల్. ఎ. గారు ప్లానింగు మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారికి విన్నవించారు.

గుంటూరు జిల్లాలో పల్నాడు వినుకొండ నర్సరావుపేట, తాలూకాలు బాపట్ల తాలూకాలో సగం వెనుకబడిన ప్రాంతాలనీ, రాయలసీమలో ప్రజలెంత బాధపడుతున్నారో యీ తాలూకాల ప్రజలుగూడా అంత బాధపడుతున్నారని, వెనుకబడిన ప్రాంతాలఅభివృద్ధికి యేసంఘాన్ని యేర్పాటు చేసినా అది, రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలన్నిటినీ దాని ఆధీనంలోకి తేవాలని, శ్రీ కోటయ్యగారు సూచించారు.

### ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలి

విజయవాడ, డిసెంబరు 17: ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలివారు ఈ సాయంత్రం సినిమా నిర్మాతలు శ్రీయుతులు పి. పుల్లయ్య, కె. శ్రీ రాములు నాయుడు గారలకు సన్మానం చేశారు. ఉపాధ్యక్షుడు శ్రీ జి. కోమరాజుగారు అధ్యక్షత వహించారు.

# బత్తలాపురం రైలు ప్రమాదం

## ములకలచెర్వు అసిస్టెంటు స్టేషన్ మాస్టర్ పై నేరారోపణ

మదనపల్లి, డిసెంబరు 19: ములకలచెర్వు, బత్తలాపురం స్టేషన్ల మధ్య జూన్ 13 వ తేదీ రాత్రి జరిగిన రైలు ప్రమాదానికి కారకుడని, రైల్వేచట్టం 101 సెక్షన్ ప్రకారం ములకలచెర్వు అసిస్టెంటు స్టేషన్‌మాస్టరు దీనదయాళు రాజుపై మదనపల్లె సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు క్రితం గురువారంనాడు నేరాలు మోపారు.

ఆ రైలు ప్రమాదంలో 64 మంది చనిపోయారు, 64మంది గాయపడ్డారు.

ప్రాసిక్యూషన్ తరఫున 20 మంది సాక్షులు విచారింపబడినారు. 133 డాక్యుమెంట్లు కోర్టులో ప్రదర్శింపబడినవి.

ముద్దాయి తాను నిర్దోషినని వాదించాడు.

శ్రీ అశ్వద్ధ నారాయణగారు మాట్లాడుతూ మండలి స్వంతభవన నిర్మాణానికి 8 లక్షల రూపాయలు వసూలు చేయదలిచామని మొన్న మద్రాసులోని కొందరు నిర్మాతలను దర్శించగా రు. 15000 లు వసూ లయినదని ప్రకటించారు.

శ్రీయుతులు పుల్లయ్యగారు, శ్రీరాములునాయుడు గారు తమకు చేసిన సన్మానానికి కృతజ్ఞత తెల్పారు.

